ములు కౌరవహస్తాలంకృత ధనూవరములు వారిమనోరథములతోడ జాఱి క్రిందఁ డొల్లధాత్రీ రాష్ట్రకాంతాగళ విరాజమానమంగళ సూత్రములు పుటుక్కుమని తెగునట్లు మేరువుబోలు నేదునచ్చటినాదముతోఁ గలసి యూడ భేరీని నాదములతో నొక్కపెట్ట భూమిసప్తకుల పర్వతములు దిర్దిరందిరుగునట్లు వినవచ్చెను. అటుతరువాతఁ గొంతవఱకుఁ గౌరవశిబిరములు పాడిండ్లవలెనే నిశ్శబ్దములైయున్నవి కానియొకత్రుటిలో సైంధవశిబిరంబునఁ బెద్దయేడ్పువినవచ్చినది. అదేమనిచూడ సైంధవుఁడు దేవరవచనములాలించి విలపింపఁదొడంగిన వానితోనాఁడువారును నేడ్వసాగిరి. ఆరోదనము తుదకెల్లరకుఁదెల్లంబయి యుల్లంబుల భేదిల్లమొదలు పెట్టినది. అప్పుడాతఁడు తనకేడుగడయగు దుర్యోధనుఁడిక్కడి వృత్తములవారి వార్తావహులచేఁ బేరోలగంబునముందుసంతసంబున వినుచుండఁబోయి యనాథాంగనవలెఁ బెద్దపెట్టున రోదనము జేయనారంభించెను.

అర్జు— (అబ్బురముతో) ఏమేమి! తరువాత! తరువాత!

చారి— తరువాతనో దేవా! కౌరవయోధవులిది యేమనియచ్చెరువడిచూడ గణ్ణా ద్యాప్తవగణంబురానున్న కష్టముదెలియక చింతింప రారాజాతురమునవగ్గరకు దీసిముందలింప నెట్టకేలకుఁ గనులనుండి బాష్పధారలు కాలువలయి పాఱ గద్గదికముతో సైంధవుండిట్లనియె.

శా॥ ఓనామిత్రవరేణ్యులార! వినుఁడ ♦ యోగ్యావాదుదీనోక్తులన్
నేనేసంగరమందుఁ బాండవులకున్ ♦ నిక్కంపుశత్రుండనో
కానీనస్నైధనంజయుండుపటుసం ♦ గ్రామాంగణంబందురే
పేనాకంబుజొరంగఁజేయునఁటని ♦ ర్భీతుండనైనిల్చినన్ 17

గీ॥ బ్రతికియుండినబలుసాకు ♦ నతులితముగ
మెసవిబ్రతుకంగవచ్చునీ ♦ వసుధయందు
వరకపిధ్వజుఁడాడిన ♦ పల్కునిజము
గాకయుండునేకృష్ణుండు ♦ గలిగియుండ 18

కావున నాయవి దీనోక్తులని నిరసింపక కరుణార్ద్రహృదయులై నాకుఁబోవ సెలవిచ్చిన నేనిదేప్రాణ సంరక్షణార్థమై నడియడవులఁబడిపోయెదనని వెక్కివెక్కి యేడ్వసాగెను.

అర్జు— ఛీ!ఛీ! బాలిశాధమా! కులాచారకుఠార! అఁడముండా! మాకులమునకళ్లుండవయి మాకును దలవంపులు దెచ్చుచుంటివి. చారిత్రా! యేతచ్చరణాగత రక్షణబిరుదాంకుఁడగు సుయోధనహతకుఁడేమని మందలించునో నుడువుము విని యెదను.

చారి— దేవా! యిట్టియధీరాలాపంబు లాలింపఁగురు కుమారాద్యాప్త వర్గంబుమిగులవగలఁబొందిరి. ఇతరసామంతరాజులులోలోననవ్వికొనఁబోడంగిరి. గురుకృపాశ్వత్థామాది పాండవపక్షపాతులు దేవరకిది యొక్క శుభసూచకముగా యోచించిరి. అప్పుడు రారాజు కర్తవ్యాంశమాలోచించు వానిఁబోలెనట్టిత్తరువుఁబుతుణించెను. కొందఱుయోధులు తమకేదిమూఁడునోయనియింటికిఁ జల్లచల్లగజాఱిరి. అంతరాజు తేజీపారఁజూచి సైంధవునితోనిట్లయె.

గీ॥ పాఱిపోవఁగనీకేటి ♦ భయముబావ!
నరుప్రతాపమోర్వఁగయోధ ♦ వరులులేరె!
శరగురుండయినద్రోణుండు ♦ పరబలాఢ్యుఁ
డైనకర్ణుండున్నిప్డు ♦ కానకిడునె? 19

కావున నీవిట్టియధీరాలాపంబులవీడి నీవీడుజేరి నీయాడవారలతో సుఖంబుండుము. అనిచెప్పనంత నాతఁడు నన్నుఁజంపుకొననిచ్చయున్నఁ బోనీకుము లేకున్ననన్నువదలుము.. త్రిలోకభీకరానేక సాయకనాయకుఁడైననదుండు వరవానరశేఖర ధ్వజాలంకృత దివ్యస్యందనముపై సుందరవదనారవిందమందు మందహాసముఁదోఁపఁ గోదండోత్తమ గాండీవజ్యాటంకార చలద్బ్రహ్మాండుఁడై యంబకపరంపరఁ బర్వుచునురువడింప నిలింపులకన్న మాటమేల సాక్షాన్నిటలాక్షుండెదుర నిలువఁగలుగడనుట నిస్సంశయము. ఈనాఁడు బాలునిపోరాటములోవలె మాయలుబన్నుటకు మాయలమారికృష్ణుండుండెఁగదా! అట్టివారిఁ దేఱిచూచుటకును మనకర్ణాదియోధబృందములోడకుందురా! కల్ల!కల్ల! నేనీరణమందున్న నాప్రాణములకు నిరాశజేసుకరావలెఁగానినన్నుఁగాపాడువారుండరు కావున క్షమించి యనుజ్ఞనిమ్మని కాళ్ళపైఁబడెను.

కృష్ణ— అరణ్యమధ్యంబునఁ బనకైన పాట్లిప్పటికి జ్ఞాపకముజూపెఁగాఁబోలు

చారి— తరువాత నో దేవా! రారాజోడకుండ మని లేపఁదీసి ద్రోణునియొద్దకుఁ దీసుకొ
నియేగి నీకెట్లయిన రక్షింపక తప్పదని కాళ్ళపైఁబడవైచి తానునుబడెను.

అర్జు— ఏమేమి! ఆమహాత్ముఁడేమనెనో!

కృష్ణ— ఈమర్యాదకొడంబడకుండునా?

చారి— దేవా! అప్పుడాతఁడు వారలిద్దరిలేవనెత్తి యక్కునఁజేర్చి యనునయవాక్యం
బులఁబెక్కు వక్కాణించి తుదకభయమిచ్చితినని సైంధవునకు ధైర్యము చె
ప్పి యోదార్చెను అప్పుడాతండెట్టకేలకు దృఢపడి యింటికేగెను నేనునిట
కు దేవరదర్శనార్థమై యేతెంచితి.

అర్జు— చారిత్రా! చిత్రములు విచిత్రములుగా ముచ్చటించితివి పొమ్ము.

చారి— చిత్తము. (అనినిష్క్రమించును)

కృష్ణ— నేనొకందులకుఁ జింతించుచుంటి

మ॥ కదనంబందున సైంధవున్ జెనకుటల్ ♦ కాకుండినన్నెవరె
య్యేదో చేయఁగలనంచుఁ బల్కితివి; యా ♦ యింపైనవాక్కుల్విన౯
ముదమై వారలు సైంధవు౯ రణభువి౯ ♦ బొల్పొప్ప రక్షింపఁగా
ముదిపారుం బురికొల్పవాఁడభయమున్ ♦ మోదంబుతో నిచ్చెఁగా 20

మరియు

గీ॥ ముదుసలియటంచు మనమున్న ♦ గదనమందుఁ
గదలమెదలనీయక యొ సురి ♦ క్కంగఁజేయుఁ
గరుణమైవదలిననిల్వఁ ♦ గలముగాని
యతని బాణపరంపరన్ ♦ బరితుకఁగలమె?॥ 21

అర్జు— (ఆబ్బురముతో) బావా! మహానుభావ! యెందులకీపిఱికి మందు? యిటు
వినుము.

మ॥ గురుడైనన్ గిరిగర్వభంజక మహా ♦ ఘోరస్వరూపోద్ధత్స్వరం
దరుఁడైన౯ ద్రిపురాసురోద్ధతిహార ♦ చ్చండోగ్రశూలస్ఫుర
త్కరుఁడైనన్ గమలాసనుండయినసం ♦ గ్రామంబులో నేపున
న్నరికట్టన్ సమకట్టలేఁడనుటస ♦ త్యంబింక శంకేటికి౯ 21

అదియునుగాక మహాత్మా!

ఉ॥ లోకము లెల్లబొట్టనిడి • లోటొక యింతయులేక ప్రోచు నీ
ధాకకుమీరువాఁడుగలఁ • డాభువనత్రయమందుఁ జూడఁగా
నాకిఁక నేటిభీతికడ • నంబున నానొగ లెక్కి నీవెయ
స్తోకరయంబునన్ రథముఁ • దోలుచుఁ బోవఁగ దేవకీసుతా॥ 22

కావున భవదాజ్ఞానుసరణ సమర్థుండనైన నాకిఁక విశేషమందుఁ బోయెదను

కృష్ణ— ఔనౌనది యెటులుంగకపోలేదు. కాని నీవిప్పుడు శుచివై పశుపతి నారాధించుము.

అర్జు— ఏటికి బావా!

కృష్ణ— ఏటికన నేటికి నామాటఁ బోటుపోనియ్యక యెందులకో ముందుముచ్చటించెద గాని యయ్యార్త త్రాణపరాయణుండగు శంకరు నారాధించుము.

అర్జు— మహాప్రసాదము. (పద్మాసనుఁడయి చిన్ముద్రపట్టి)
జయజయ శ్రీమద్ధరణీధర కన్యామానసాబ్జభృంగా! యుత్తుంగమాతంగవిభంగా! భసితావృతాంగ! తాండవకేళీసంగా! లీలాధృతకురంగ! మాంపాహి! మాంపాహి! మాంరక్ష (అని నిమీలితలోచనుఁడగును)

కృష్ణ— (తనలో) ఇప్పుడే యితని నంబరమార్గమునఁ గైలాసమునకుఁ గొంపోవుదుఁగాక

అర్జు— (నిమీలితలోచనుఁడై)

క॥ హరుఁడవు మదీయపాతక
హరుఁడవు సకలభువికంట • కాచారకసం
హరుఁడవు నజ్ఞానాంధమి
హిరుఁడవు కావఁగదె నన్ను • నెంతయుఁ గృపతో॥ 23

(తోడనే కృష్ణుఁడు వానిఁబట్టుకొని యాకాశమున కెగురును యవనిక జారును)

ఇది తృతీయాంకము,





ఓమ్.

శుభమస్తు.

# సైంధవార్జునము.



## చతుర్థాంకము.

ప్రదేశము—కౌరవశిబిరప్రాంతము ప్రవేశము—కౌరవభటుఁడు

భటుఁడు—(పండుకొనియుండి) ఏదియెట్లున్నను భూభారము తగ్గింపఁబడుటయే యీ వెఱ్ఱిగొల్లనికి నా కేనికి నుద్దేశమైయుండును. పోనిమ్ము నాకేల యీబాధ; రాత్రియంతయు నెప్పులు పెడబొబ్బలచే నిద్రఁబట్టలేదు. (ఆవులించి) విధవనిద్ర మఱల మొదలుపెట్టినది: నిద్రపోవుదునా?

2వ భటుఁడు—(ప్రవేశించి) వాని యదృష్టమే యదృష్టము. దరిద్రుఁడు తలఁ గడిగికొనఁబోవ వడిగండ్లవాన యనునట్లు మనవారెంత గింజుకొనినను పెద్దమ్మ నెత్తిపైఁ ద్రొక్కుచునేయున్నది. (పరికించి) బావా! బావా!

1వ భటుఁడు—(నిద్రనభినయించుచు) ఛీ! ఛీ! నన్నుఁబిలువకు నేను నిద్రఁబోవుచుంటిని

2వ భటుఁడు— బావా! నీనిద్రకు గుఱ్ఱులేదేమి?

1వ భటుఁడు—గుఱ్ఱుండుటకు నాదియంత మెలకువ నిద్రగాదు.

2వ భ—మాట్లాడుచు నిద్రించుట నీకొక్కనికే కాఁబోలు నేమి?

1వ భ—ఇప్పుడు నేను మాట్లాడుచున్నా ననుకొనుచున్నావా?

2వ భ—ఇంతకన్న విరుద్ధముగా నెట్లయిన నెప్పుడైన మాట్లాడఁ గలవా?

1వ భ—నీవంటివారు వచ్చినప్పుడే!

2వ భ—ఎంత నేపటినుండి యీనిద్ర?

1వ భ—నాకు మెలకువ వచ్చినప్పటినుండియును.

2వ భ—ఈవికటవుల కేమిగాని నిన్నటి రాత్రి నర్జునుఁడు కైలాసమేగినాఁడఁట వినావా!

1వ భ—(తటాలున లేచి) నారాయణ! జబ్బేమిటి? చెప్పు! చెప్పు! శైవమతస్థుఁడు గనుక నా కైలాసమేగెనంటివి. ఎంతపనిజరిగినది? కృష్ణుఁడుగూడ వెళ్ళినాఁడా

2వ భ—ఏడిచినట్లేయున్నది నీయొకసక్కెములు. తుదవరకు విని మఱియేడ్వుము. కృష్ణుఁడును వెళ్లినాఁడు.

1వ భ—నారాయణ! మొత్తుకున్నట్లె యున్నది! చావు కబురు సందిగ్ధముగాఁ జెప్పఁగూడదని యెఱుఁగవా? నిన్నరాత్రి నెవరెవరేగినారో చెప్పుము.

2వ భ—చావుకబురెక్కడిదిక్కడ?

1వ భ—ఇప్పుడు చావకుండఁ గైలాసమేగినవారెవరు?

2వ భ—కృష్ణార్జునులు.

1వ భ—సరి! సరి! కైలాసమేగి?

2వ భ—అచ్చట శంకరు దర్శిం[illegible]పతాస్త్రము సంపాదించెనఁట

1వ భ—అప్పుడే నీకెట్లు తెలి[illegible]!

2వ భ—నీవలె నిప్పటివఱకు నిద్రఁబోయిన నాకునుఁ దెలియక పోవును.

1వ భ—అయిన నిప్పుడు చుక్క పొడిచినదా?

2వ భ—చుక్కబొడుచుటయే గాదు సూర్యకిరణములు నీప్రక్కఁ బొడుచుటకు సిద్ధముగానున్నవి. చూడుమటు.

సీ॥ పాంథజనులనెల్లఁ ♦ బట్టుక బాధించి
బాధించిపోయెనా ♦ పంచశరుఁడు
తతవియోగానల ♦ తప్తముల్ కోకముల్
గలసితావంతలఁ ♦ దలఁచుకొనియెఁ
జంద్రకిరణజాల ♦ సక్తమై స్రవియించు
విధుమణుల్ దప్పితను ♦ విడువఁబోడఁగెఁ
గుక్కుటంబులునిండ ♦ నెక్కిరెక్కలవిచ్చి
కుక్కురో కోయంచుఁ ♦ గూతలిడియెఁ

గీ॥ బరిసరారణ్య బహువిధ ♦ ఫలకుసుమ ప
రిమళలహరీసమేతవా ♦ తమతులగతి
వీవఁదొడఁగె వృక్షములపై ♦ విచ్చలవిడిఁ
బక్షిజాతంబు లేఁగెఁబ్రి ♦ భాతవేళ॥

1వ భ—(లేచి యావలించి) బావా! నీవర్ణనలో నానిద్రిసంగతి నేమియుఁ జెప్పితివి కావేమి.

2వ భ—నీవింకముందుందువో లేదోయని.

వ భ—నీతోఁగూడఁ గృష్ణునివలె వత్తుననికొంటివా?

2వ భ—నాతోవచ్చిన నీవు లేకపోవుదువను జింతయేలేకపోవును.

1వ భ—నిన్నటిదారి తప్పెనాయేమి?

2వ భ—తప్పదా? నిన్న నభిమన్యుఁడీవేళ నర్జునుఁడును

1వ భ—చచ్చుటకా?

2వ భ—కాదు! కాదు. మనలఁజంపుటకు! రారమ్ము పోవుదము ఉన్నవాల్లుగడియలు పెండ్లాము బిడ్డలఁ జూచుకొన్నఖంచిది.

1వ భ—ఔనౌను నిన్నటి నాబ్రితుకు బ్రితుకుగాదు యీనాఁడు తప్పించుకొని వచ్చినబ్రితుకు బ్రితుకు

2వ భ—ఈనాఁడు బ్రతుకు మనము ముందుఁ దరువాత సైంధవుడునుజముపురమునందే

1వ భ—అంత నిశ్చయము మనకేల (పరికించి) అల్లదిగో చూడు మప్పుడే మన మునలి సైన్యములను గుడికి మేకపోతులఁ దోలునట్లు తోలుచున్నాఁడు

2వ భ—అల్లదిగో జూడుమటువైపు పాండవసైన్య మురువడించి పాలకడలి లాగున మ్రోగుచున్నది. మునుముందదిగో మనపాలిటి మృత్యురథము.

1వ భ— రారమ్మిక కడనున్న మాటపక్కదు.

(నిష్క్రమింతురు)

(వెంటనే కృష్ణార్జునసాత్యకు లేకరథముపైఁ బ్రివేశింతురు)

కృష్ణ—కిరీటీ! సాత్యకీ! ఎందులకీ వృథాకాలక్షేపము పోయియాధర్మరాజ రక్షణార్థమై మీరందఱు నిలుండు.

అర్జు— సాత్యకీ!

ఉ॥ ద్రోణుఁడు నాడినట్టిపటు ♦ రోషపుబ్రతిజ్ఞలవింటివేకదా
మానక మీరలందఱును ♦ మానవనాథునిఁగాచికోవలెన్
నేనొకఁడైతినంచు మది ♦ నీవిఁకఁజింతఁగొనంగఁబోకునా
బాణపరంపరల్ తగులఁ ♦ బాఱకనిల్తురెవారు సాత్యకీ॥ 2

సాత్యకి—మహానుభావ! బావ

గీ॥ దేవతలకైన నిన్నాజిఁ ♦ దేఱిచూడ
రాదటన్నఁబిన్నలగు వీ ♦ రలకువశమె?
యైననీప్రతిజ్ఞలఁ జూచి ♦ నేనొకింత
కాలు నిల్వకయుంటినీ ♦ కదనమందు 3

ఇచ్చట రాజుఁగాపాడుట కంటివా?

గీ॥ శత్రుభీకరుండౌ వాయు ♦ పుత్త్రుఁడుండఁ
దక్కఁగలయోధయూథంబుఁ ♦ బిక్కటిల్ల
ద్రోణునకు మారకగ్రహ ♦ మైన ద్రుపద
సుతుఁడెనిల్వ భయముధర్మ ♦ జునకదేల? 4

కావున నామనవిఁ జెల్లించి

అర్జు— (అర్ధోక్తియందే)

గీ॥ నాదుసంరక్షణార్థమీ ♦ యాదిపురుషుఁ
డైన నారాయణుండుండ ♦ నడలనేల?
అదియుఁగాక యుధిష్ఠిరు ♦ నంతవాని
రక్షణమెకాక యితరక ♦ ర్తవ్యమేది? 5

కృష్ణ— సాత్యకీ! సందేహమేటికి నీవుపోయి యచ్చటనేయుండుము.

అర్జు— నారక్షణముకన్న ధర్మజునిఁగాపాడుటయే ముఖ్యముకదా? నేనిక్కడలేని లోటు నీవుండినఁదీరును గాన వేవేగపోయి మీరందఱుమందరణ వ్యాపార పారీణులై కౌరవసైన్య పారావారమునకుఁ గట్టలైనిలుఁడు.

(అంతఁ దెరలో)

శా॥ ఏఁడీయర్జునుఁడేడిఁకృష్ణుఁడెటరాఁ ♦ డేలాసమీరాత్మజుం
డేఁడీసాత్యకి వీరలంవఱెపుడెం ♦ దెందుండిరోచూడమా

తోడన్ సంగరమందుఁ బోరెదరొ లే • దో వేళయున్ మీఱెపీ
రాడంగాఁగలరెన్నొ భిరములఁగా • ర్యంబింత కాలేదుగా॥
(తోడనే రణభేరి మ్రోఁగును)

కృష్ణ— సాత్యకీ ! త్వరపడుము. త్వరపడుము చూడుమా దుశ్శాసనుఁడెట్లు క్రొవ్వెక్కి కుక్క మొఱఁగునట్లు ప్రేలుచు రణభేరి మ్రోఁగించుచున్నాఁడో !

సాత్య— చిత్తము. అర్జునా ! సెలవా !

అర్జు— వేవేగ మేగుము.

సాత్యకి:— చిత్తము. (నిష్క్రమించును)

(తెరలో)

పంచచామరము.

అరే ! దుష్టదుశ్శాస • నా ! యేమియంటే !
దురంబందు నిన్నిష్ట • ద్రిఁగంగఁజేతున్
దిరంబైన గదాదండ • తీవ్రహతిన్గా
వరంబింకఁగానీదు • ప్రాణాలఁజిల్తున్ ॥ 7

(రణభేరి మ్రోఁగును)

కృష్ణ— కనుఁగొనుమా ! భీమసేనుఁ డప్పుడె దుశ్శాసనుపైఁ బడియె

అర్జు— (పరికించి) చూడుబావా ! యీబ్రాహ్మణునివ్యూహనిర్మాణచాకచక్యము.

మ॥ శకటవ్యూహముఁ బన్నిమధ్యమునన • క్షంబొండు నిర్మించిదా !
నికిలోఁగాఁ గురురాజ సైంధవబలా • నీకంబులన్ నిల్పివా
నికి సూచీవిధమొప్ప సైన్యమునుబ • న్నించెన్ బలోపేతుఁడై
శకటంపున్ మొనముందునిల్చెగురుఁ డా • శ్చర్యంబుదాకొల్పుచున్ ॥ 8

కృష్ణ— పార్థా ! చూచితివా ! యీదుశ్శాసనుఁడు బ్రాహ్మణుఁడు చెప్పినచొప్పననే విందుసాయము మొండిగర్వముచే వ్యూహములో నుండక యిప్పుడు మన భీమునిచేఁ జావమోదింపఁబడుచున్నాఁడు.

అర్జు— అందువలననా ! తీవ్రముగానుండవలసిన ద్రోణుఁడు నాకంటికి నిండుజాబిల్లికంటెను చల్లఁగానున్నాఁడు.

కృష్ణ— అట్లుండుట యాతని ప్రసన్నతచేఁగాదు నీసంకల్పసిద్ధిచేత !

అర్జు— అల్లెట్లగును. నీప్రసాదముచేతనే యనుకొనెదను. మాటలకేమి లెమ్ము గుఱ్ఱములపగ్గముల సడలవిడిచివడివడిఁబోనిమ్ము.

కృష్ణ—నీచిత్తమువచ్చినట్లే ! [అనిరథమువడిగాఁ బోవుటసూచించి] చూడుమిదే యుద్ధభూమి.

అర్జు— అస్మదాగమన సూచకముగాఁ దేవదత్తమును బూరింతువా !

కృష్ణ— ధనంజయా!

గీ॥ నిక్కముగనీదు గాండివ ♦ మెక్కువెట్టి
గుణముసారించి బాణముల్ ♦ క్రుమ్మరింప
దేవదత్తధ్వనికిముందుఁ ♦ దెలుపునవియె
పార్థుఁడుసుఁడీ మముఁజంపెఁ ♦ బడిలమనుచు ॥ 9

అర్జు— నీయభీష్టమేతీర్చెదను (అనిబాణములేయవానినఱకుచు దూరముగ ద్రోణుఁడు ప్రవేశించును.)

కృష్ణ— అర్జునా !

గీ॥ యజ్ఞవేదికాధ్వజమెంతో ♦ యందమొంద
ధళధళాయతధౌతవ ♦ స్త్రము ధరించి
వరశరాసనమూనుగ ♦ వర్షమాన
దురమునసలుపంగఁబరతెంచె ♦ శరగురుండు ॥

అర్జు— బావా ! వేవేగమాతని సమీపింపఁజేయుము.

కృష్ణ— సరే. (అని యట్లు చేయును)

ద్రోణు—(సమీపించి) అర్జునా !

చ॥ అతులితసంగరాంగణము ♦ నందునిలింపులకింపునింపన
న్నతిభుజ శౌర్యసంపదల ♦ నందిజయించుమి దేధనంజయా!

అర్జు— (అర్ధోక్తియందే)
పితరులఁబోలిదీవనలుఁ ♦ బ్రీతిమెయిన్ బలుపంగ నేఁబరా
జితరిపుజాలుఁడౌటలిఁకఁ ♦ జిత్రిముతౌ నెధనుర్గురూత్తమా!

ద్రోణ— ఆఖండల నందనా! నాదీవనలను మాటయేల? నరసురాసురాళియుఁ డవగుమనినిన్నుఁ బెద్దయుం బ్రొద్దు గారవించిన గంగాధరుండెప్పుడు నీ ప్రాపైయుండుటయే కాక.

మ॥ త్రిజగద్వంద్యుఁడు రక్షకుండురవిరా • త్రినాధ నేత్రుండుభ
క్తజనానందకరుండు విష్ణుఁడగుసీ • ధాత్రీ ధవుం డిష్టుఁడై |
భుజమైన త్రిలిప్రీతి పెంపువర • ధంబుల్ దోలఁగావచ్చెనో |
విజయా! దీవనలేల? నేఁటి రణప్ర • ద్వికార్యసంపత్తికై ॥ 12

కృష్ణ— ఏదియెట్లున్నను గుర్వాశీర్వాదము సర్వారిష్టహారంబే కదా! కావునఁ దమప్రియశిష్యు మన్నింపవేఁడుచున్నాను.

ద్రోణ— కృష్ణా!

మ॥ మనపార్థుండనినట్లు తండ్రినివలెన్ • మన్నింపఁగాఁగంటి నే |
నునువానిన్ దయతోడనట్లులనె నూ • మల్ జోలెవీక్షింతునై |
ననుదుష్కాలవశంబునన్ రణమున • న్నాహంబయెన్ కృష్ణ! వా
నిని భంగంబొనరింపకుండఁగనె మ • న్నింతున్ దయన్ బార్థునిన్ ॥ 13

అర్జు— మహాత్మ! శరగురుప్రవరా!

గీ॥ దేవదేవుబోలిన మీదు • దీవనలను |
బడయుటే చాలువేఱుగ • మన్ననేల? |
పల్లకై వచ్చియుంటిదా • చకయెమీరు |
రణమొనర్పఁగ సెలవిండు • రయముతోడ ॥ 14

ద్రోణు— (వికటముగా) కిరీటి!

గీ॥ కదనమారంభమైనట్లు • కనుఁగొనఁగ |
మనదుందుభినినాదంబు • వినఁగఁబడదె? |
సజ్యమైయున్న నాధనువుద్ద • శ్యంబుకాదె? |
యింక నేటికి సెలవులో • యింగితజ్ఞ ॥ 15

కావున వేవేగ రారమ్మిదే బాణముల వదలుచున్నాను.

(బాణము వేయును)

అర్జు— (దానిఖండించుచు) మహానుభావా!

గీ॥ మీావలన నేర్చినచదువు ♦ మెదలుమన్న ।
సమరధర్మంబుభంగింప ♦ సాహసింప ; ।
నెవరొ చెప్ప గోఁజికింత ♦ నేనుసిద్ధఁ ।
గోఁజికయత్నింపసుండి స ♦ ద్గురువరేణ్య ! ॥ 16

ద్రోణు— (తనలో) హా ! హా ! నిన్నటి నాకార్యము బాగుగనెత్తి పాడుచున్నాఁడు. ఏమియనుటకు నోరాడకున్నది. లోనికూరక నీనిఁబోనిత్తు మన్న రణధర్మ విరోధ మొకటియే గాక రారాజునకుఁ బ్రబలవిరోధుఁడ నౌదును కానిమ్ము కృష్ణుఁడుండెఁగదా యేదియోనొక యుపాయమాలోచింప కపోవునా ? (ప్రకాశముగా) అర్జునా నావలన నేర్చిన విద్యయేకాన నాకప్పఁజెప్పుము నన్నోర్చినఁగాని నిన్నొక్క యడుగుఁ గదలనీయను.

(బాణము లేయును)

అర్జు— మహాత్మా ! తమయభీష్టమే తీర్చెదను.

కృష్ణ— (రహస్యముగా) ఏటికీవెఱ్ఱి !

గీ॥ ముసలిబాపనితోడనీ ♦ యసమసమర ।
కేళిసల్పుచుంటివికాని ♦ కేవలంబు ।
ధీసమాహారి సైన్యంపుఁ ♦ దెంపుఁగనవు ।

అర్జు— యెఱుఁగుదును నాజివీరుని ♦ నెట్లువిడుతు ? ॥ 17

కృష్ణ— పరిసన్న వాక్యము లాడించుచుండుమేను రథముఁ బ్రదక్షిణమిషలోనికిఁ బోనిత్తును.

అర్జు— పెటుకు మాటలకుఁ దరువాతం బరిసన్న వాక్యముతేల ! నయిష్టము వచ్చి నట్లు రథమూదోలుము నాయిష్టము వచ్చినట్లు బోరెదను.

ద్రోణ— అర్జునా ? యూరకొంటివేల బాణములేవిరావేమి ?

అర్జు— మహాత్మా ! తామశరంబులేసిన నేనేయుదు.

కృష్ణ— (తనలో) ఇదేసమయము. (ప్రకాశముగా) గురుప్రవరా !

గీ॥ తల్లిదండ్రులకన్నమ ♦ మ్మెల్లవేళ ।
యందు సాకినమీాకిదే ♦ వందనము లు ।
(అర్జునువైపుఁ బలికి) అర్జునా మనమాయాన ♦ కరప మెక్కి ।
నేఁడ్ బరిగక మ్మనుజేయ ♦ కేగఁదగునె ? ॥

(అనిరథము నతివేగముగాఁ బ్రదక్షిణముజేసి లోపలికేగును)

ద్రోణు— (చిఱునవ్వుతో) ఆఁ! ఆఁ! కృష్ణా! మాయకాఁడా! ప్రదక్షిణమిమచే లోనికిఁబోయిన వదలుదుననుకొంటివా? వెనువెంటనే నీపేఁపు వ్రక్కలు జేయనా?

(అనివెనువెంటనే పోవును)

(తోడనే యంబర మార్గమునుండి దిగి సౌగంధుఁడు ప్రవేశించును)

సౌగ— అహా! కృష్ణుని చాకచక్యము! ఒకలిప్తలో రథములోనికిఁ బోవునట్లు చేసెను. (పరికించి) అయ్యయ్యో! ద్రోణుఁడును వెంటనంటి యెట్లురుము చున్నాడో?

సౌరభ— (ప్రవేశించి) అన్నయ్యా! చూడుమా యర్జునుని వెనుకవచ్చెడి ద్రోణప్రయుక్త బాణపరంపరం గత్తిరించి ముందురవహించుచున్న సైన్యమును జించి చెండాడుచుఁ గృష్ణునకు దారిఁ జేయుచున్నాఁడో?

సౌగ— చూడు చూడు సౌరభా! పాపము కృష్ణార్జునులు కుంభ సంభవుని క్రూరనారాచములు పక్షము దూరనొకింత సోలిముఖులేచిరి.

సౌర— అగునగు నన్నయ్యా! కాని యీపారుని చలమేచలము. (పరికించి) అయ్యో దాఁటిపోయిరి.

సౌగం— అబ్బబ్బ! యీద్రోణుని మొగముఁ జూడుము ఖిన్నతవహించి యెట్లు ముకుళించినదో.

సౌర— అన్నయ్యా! యీచతురంగముల పాట్లెట్లుండెనో కాంచుము.

సీ॥ కులిశధారాహతిఁ ♦ గూలుధరాధర
పంక్తియో యనఁగ ద్వి ♦ పప్రకరము!
పెనుగాలి తాకుచే ♦ విఱుగుధారాధర
రాజినానుద్భట ♦ రథనయంబు!
లింద్రజాలికకోల ♦ నిట్లన్న మాయమా!
పస్తువోయనఁగన ♦ శ్వనికరంబు
గాలివానలఁగూలు ♦ కదళికావృక్షసం
తతులనఁగఁ జనుప ♦ దాతిసమితి

గీ॥ సరసురాసురాభంగమై ♦ నట్టిగాండి
వపుముక్త ప్రచండాశు ♦ గప్రకాండ
పాతినిగళులు దప్పి తిక్షితికిఁ ♦ జతికిలఁబడి
మాయెమైపోయెనురణ ♦ మహినిఁజూడ ॥ 19

సౌర— మనమానంకఁ జూడఁ గాంచనేలేము. కృతవర్మ యర్జును నడ్డనచ్చెఁగాఁబోలు దనరథముపైఁ జచ్చియుఁ జావనివానిఁగు భ్రాంతిఁబడియున్నాఁడు (పరికించి) అగ్రజా! చూడు మామిత్రుని పాటుఁజూచి సహించలేక కృష్ణార్జునులఁ బొదివిపమునగు ప్రదరములవదల మొదలిడిన భోజపతిని.

సౌగం— అనుజా! పాపమాయర్జునుఁడు బంధువని యూరక బాణపరంపర సహించి యంతఁజేయు చుండనున్నాఁడు.

సౌర— అగ్రజా! ఇదిగో కృష్ణుఁడు వాక్రుచ్చుచున్నాఁడు.

(తెరలో)

గీ॥ బంధువంచునుదయఁ జూడ ♦ బవరమందుఁ
బనులు సాగఁగాఁగలవె ♦ యో పార్థివేంద్ర?
శత్రువులఁ జేరియున్న భో ♦ జపతియిపుడు
తలఁచలునఁగాఁబడఁదగున ♦ తండెసుమ్ము! ॥ 20

సౌగం— అరరే! కృష్ణుఁడిట్లు చెప్పెనో లేదో కాని తదుత్తరక్షణమందే భోజపతియు ఖాంభోజముగాఁ జాఁబారి ఖండితభుజమట్ల తేజముతప్పి రథముపయినుండి పడియె.

(తెరలో)

గీ॥ పిచ్చుకలపైని బ్రహ్మాస్త్ర ♦ మచ్చుపడఁగ
నెత్తినట్లు కాసునుజేయ ♦ నివరణీప
సమితితో సమరముఁ జేసి ♦ జాగు సేయ
సమయమేయిది సైంధవుఁ ♦ జంపవలదె? ॥ 21

సౌర— అన్నయ్యా! కృష్ణుఁడిట్లని తనరథచోదకసామర్థ్యముఁ జూపుచున్నాఁడు ఇఁక నీపేరునడ్డువారు లేరు సుమా? (పరికించి) శ్రుతాయుధ ప్రముఖమహారథికులు [illegible]

సౌగ — ఉండెడిదేమిటి

గీ॥ మనమనుకొనుటయేతడ • వశఁగనయ్యెఁ
గానియింతగానరునిపైఁ • గాలుఁద్రవ్వ
రథగజాశ్వపదాతులు • రణధరణిని
బాణజాలంబులోనన • లీనమైరి ॥ 22

సౌర — పాపమీ సైన్యమంతయు రక్తసముద్రమందు మునిఁగి తేలుచున్నది కాని యొక్కరుఁడును నిలువరింపలేకపోయెఁగదా ? అగ్రజా ! సైంధవపతాక మేమయిన గాన్పించుచున్నదా !

సౌగం — కాన్పించకేమి ? దూరముగానున్నది.

సౌర — అగ్రజా ! దుర్యోధనుఁడేలకో మొనవయిపునకుఁ బోవుచున్నాఁడు.

సౌగం — ద్రోణాచార్యునితో మంతనములేమో కాంతుమురమ్ము.

(నిష్క్రమణము)

2 వ రంగము.

[ప్రదేశము.] రణభూమి — [ప్రవేశము] ద్రోణుఁడు విగతరథుఁడై

ద్రోణుఁడు (తనలో) ఆహా ! యీపాండవసైన్యము

ఉ॥ బాణపరంపరాశతము • పారముగాఁబరపించి రక్తపున్
సోనలువేమరుల్ గురియ • సొక్కుచు సోలఁగఁజేసినన్ రణ
స్థానమువీఁడకెంతయును • దాధృతితోసికతంపుఁ బ్రాతరల్
పోనియటుల్ వనుక్ గవియఁ • బోరొగిభోరని తారసిల్లెఁగా ॥ 23

ఎన్నిమారులు నిలువరించినను సైంధవుని ప్రాణములాగుఁలాగుఁ గనఁబడదు. ధనుజయుండప్పుడె మూలబలము జేరినట్లుగానవచ్చె పోనిమ్ము ఎవరి కర్మము వారిది నాయోపినంత వట్టు సమరధర్మ మారఁడివుచ్చకయేన దుతును. తరువాత దైవవశము ఆదైవమనఁగా నెవ్వఁడు ? దేవకీనందనుఁడగు గోవిందుఁడే (పరికించి) అదేమి రారాజు దుస్తేజుఁడైయాజివదలి నాజతనం నవకు రోజుచునే తెంచుచున్నాఁడు మోముఁజూడ రోషకషాయితము యి యొప్పుచున్నది. ఏమిమూడునోకదా ?

దుర్యో — (ప్రవేశించి తనలో)

గీ॥ ఏదియైనసంఘత్వమం • దేపుఁజెందుఁ
దలకొకనిపెత్తనంబైన • దగ్ధమగును
కట్టఁగట్టిన చీపురు • చిట్టిపుడుక
లట్టెవిఱుఁగునటెబ్ర • యత్నమందుఁగాక॥ 24

(ప్రకాశముగా) కుంభసంభవా ! నమస్కారము.

ద్రోణు— రాజరాజా ? ఇష్టప్రాప్తిరస్తు.

దుర్యో— (వికటముగా)

గీ॥ తమరివంటియోధులురణ • ధరణియందు
మెలఁగనిష్టములకులోటు • కలుగఁగలదె

ద్రోణు— ఏమియిట్టులవికటంబు • లెసఁగుచుంటి
వెట్టిలోటులుయోధుల • కిపుడుగలిగె ? ॥ 25

దుర్యో— మహానుభావా ! లోటేమున్నది

గీ॥ కప్పయెలుఁగుపాములు తేసెఁ • గప్పఁబడిన
కత్తులీరణమునఁదిరు • గంగఁగంటి
నందుముఖ్యుఁడవీవైతి • వనఁగలానె ?
యెంతచెడినశిష్యుండవై • యేడ్వఁబట్టి ॥ 26

ద్రోణు—ఏమేమి ? సుయోధనా ! నీవేనాయిప్పుడు పోట్లాడుచున్నది ? జయము కావలసినవాఁడవేనా నీవు ? నాయందుగురుత్వమున్నదా నీకు ? ఏమంటి వేమంటివి? (కప్పయెలుఁగు ...... పూర్వోక్తపద్యమునుజదివి)నిదియేనా? నీతెలివికిచాలసంతసించితిని.

గీ॥ కొండెములుజెప్పుదుష్టక • ర్ణుండొకండు
ముష్కరతగల్గునీదుత • మ్ముండొకండు
నీకులమునకునాశంబు • నిక్కముగను
జేసమర్థులెనమ్ము • దిట్టెదేల ? ॥ 27

దుర్యో— (కోపముతో)

ఉ॥ చాలునుజాలునింకమఱి• జాలియొకింతయులేకయంగభూ
పాలునిదిట్టఁజొచ్చితివి • పాపమటంచుఁ దలంచకేనరుం

డాలముసేయఁబోవఁబ్రియ • మైనదాఁటఁగనిచ్చితౌర ! పా
ల్మాలికఁజేసి సైంధవుని • మాకిఁకదక్కఁగ నియ్యవయ్యయో ! ॥ 28

ద్రోణ— దుర్యోధనా ! బాగుగా వాఁగితివి.

చ॥ అగువగు సేనెనీకిచట • నంతయు మోసము పెక్కుజేసిన
ట్లగపడుచుంటవింతలగు • నా మును ద్రుపదాత్మజాంగనన్
బగఁబొగులంగఁజేయుతెగు • వక్ నినుఁజుట్టుకయున్నవన్నఁగా
పఁగఁదరమా ఖలాత్ములను • బారుఁడకే నొఁకపెద్దనాయిటన్ ॥ 29

నీనీచబుద్ధి పోనిచ్చుకొంటివిగావు నాయథాశక్తి వినియోగించి నరు నిలువరింపఁ జాలకున్నను వాని సహాయమొనర్పఁబోవు నీపాండవులనాటం కపఱచు నాపైనీవీయపవాదము వేయ సాహసించితివే ! సైంధవుఁగాపాడు కొనుటకైయేకదా నీయాప్తవర్గముతో సమగ్రముగానిల్చి నన్నొక్కని నీమొననేడువమనిరి. కాని ! కాని ! కృతఘ్నులకుఁ జేయునుపకారమును కొనెదను. కొండెముల ముండకొడుకగు కర్ణుండుండెఁగదా ! నామాటయే లికి వాఁడుండుపఱుప నీమొండిబుద్ధి యిట్లు నేయుండును.

దుర్యో— (అర్థోక్తియందే)

ఉ॥ కొండెము కొండెమంచుఁగడు • గ్రూరముగావచియించెదేలనీ
ఖండనధర్మమొక్కటటే • బాగుగఁగాంచుమి నిన్నరేయి నే
మండఁగ నేటిభీతియని • యూరక సైంధవుఁజంపనుంటిపా
రుండవొ నీవుమాగణగు • రుండవొ మాకిటమారకుండవో? ॥ 30

ద్రోణ— సెహభాష్ ! చెప్పుదెబ్బ గొట్టితివి. నీవనినట్లు నేనిప్పుడే కాదు పారుఁడఁ గాక పోవుట !

సీ॥ గాలిచూలికిమాఱు • గరళంబుఁబెట్టఁజూ
చిననాటనుండి బ్రా • హ్మణుఁడఁగాను
లాక్షాగృహదహన • మీక్షించిలజ్జతో
నొరగుదినమె ధరా • మరుఁడఁగాను
కపటంపుజూదంబుఁ • గాంచియూరకయున్న
రోజునుండియును బా • రుడఁగాను

అర్జు— బావా ! నీయవ్యాజకరుణా కటాక్షము లేక్షణములో నాపైఁబడెనో యా ప్రకటనుండియే నాకీసామర్థ్యము. యెందులకీవృథా వాదము. దిగుదిగు నీవు గుర్రముల బాగుఁజేయుము. [కృష్ణుఁడుదిగఁగా నేదానునుదిగును.]

కృష్ణ— పార్థా ! నేఁబోయి యచ్చట నే బాగుజేసుకొని తీసుకవచ్చెద .

(అనిరథముతో నిష్క్రమించును)

[నేపథ్యమునఁగలకలానంతరము.]

గీ॥ అర్జునామకపైనిది • వ్యాప్తిసమితిఁ
బర్వుచు బలంబుచే తెంచెఁ • బదిలముసుమి
గాండివ ప్రముక్తశరాళిఁ • గావరంబ
డంచి మాదురక్షణముఁగా • వించుమిపుడు ॥ 36

అర్జు— గీ॥ నందనందన | యిందుఁగం • దొంప నేల!
కాంచువారి దగ్ధంబుఁగా • వించుచుంటి
దివ్యశరపరంపర లేసి • తృటిని నిపుడు
. గుర్రములమాత్రమీవుబా • గుసవరించు॥

(అనిబాణములేయఁ బెద్దయగ్నిజ్వాల కనంబడును)

కృష్ణ— (ప్రవేశించి యానందమున నర్జునుఁ గౌఁగిలించుకొని)
చ॥ అరరె! విరోధిమధ్యమున • నశ్వములన్ సవరింపఁ జేయుసీ
పరశరశక్తి యద్భుతము • పార్థ ! యిఁకొక్కటి ముచ్చటించెదన్
వారులు జలంబుఁగోరియన • యంబునొగర్పుచునుండెఁగావునన్
సరగున వానికిన్ జలము • సంగినగాని మెలంగలేవుసూ 38

అర్జు— బావా! నీకరుణయనునది యున్నయెడల నది యెంతపని? చూడుమిప్పుడు-
గీ॥ నేనే పితృభక్తుఁడనయితి • నే నిసురలు
నన్నుమెచ్చుట నిజమేని • యన్నధర్మ
జుఁడిలసత్యసంతుఁడేయైనఁ • బుడమి పగిలి
జలము పైటకెగరెడినా • శరవరమున॥ 39

(బాణమేయ భూమినుండి జలము జుమ్మని యెగురునుతోడనే దుందుభులు తరువాతనాకాశమున)

గీ॥ దీనిసేరునుమరలసం • ధింపరాదు
కానఁగాంచుము నేనుసం • గ్రామభూమి
వానిచేత నెకవచంబు • వదలఁజేసి
పారఁగొట్టుదుశరపరం • పరలనేసి॥ 49

[అనిబాణములేయ దుర్యోధనుని సారథి రథ్యములుగూలును.]

దుర్యో — [తనలో] ఆహా !

క॥ ఏమీయాతని శౌర్యము
సామంతంబగుకవచము • జక్కగదునిమెఁ
నామానముదక్కునెసం
గ్రామాంగణమందునిలువఁ • గాఁబారవలెన్ ॥

(అనిపాఱిపోవును తోడవీరును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము





ఓమ్

శుభమస్తు.

# సైంధవార్జునము.



## పంచమాంకము.

దేశము-రణభూమి　　　　　ప్రవేశము-పూర్వోక్తభటులిద్దఱు.

౧ భటుండు-బావా! బ్రతికియున్నావా?

౨ భటుండు-చావఁగా మిగిలినాను.

౧ భ-ఎవరుచావఁగా మిగిలినావు?

౨ భ- నేనే.

౧ భ—నీవుచావఁగా నీవెట్లుమిగిలితివి?

౨ భ—అదే! చిత్రమా? నాదేహమిప్పుడు చావలేదు నాప్రాణములు చచ్చినవికను కనే నేను చావఁగామిగిలినాను.

౧ భ—నీప్రాణములు చచ్చి నీదేహములేదనఁగ?

౨ భ—నీమొగము! చంపుచున్నావు! పెద్దమ్మా! నాప్రాణము లీలోకములో లేవు నాకన్నముందేగి యచ్చట నాకుబస మొదలగునవి గుదుర్చుటకుఁ బోయినవి

౧ భ— ఎక్కడ?

౨ భ— వీరస్వర్గములోఁ

1 భ—అదెక్కడ

౨ భ—అది యిక్కడకు దాదాపుగా రెండుమైళ్లుండును.

౧ భ—నీప్రాణములకుఁ దోడెవ్వరులేరా?

౨ భ—లేకేమి డబ్బది పదునొకండుగురు ముందేగినారు.

1 వ భ — ఈకందాయింపంతా యెవరు?

2 వ భ — ఇంక నెవ్వరు మనపాలిటికీదినమర్జునుఁడే!

1 వ భ — అయిన నీప్రయాణము నిశ్చయమన్నమాటే?

2 వ భ — నీతోపాటే!

1 వ భ — నేనీకందాయింపులోరాను.

2 వ భ — మఱియెవ్వరున్నారు?

1 వ భ — సరి సరి యెఱుఁగరాయేమిటి? అర్జునక్షేమంబు తెలియక సాత్యకి బ్రతిమాలి ధర్మరాజుగారు మనపాలిటికి యమధర్మరాజులాగున నే పంపినారు

2 వ భ — ఆఁ! ఆఁ! మన మునలాని దాఁటినాఁడా వాఁడు?

1 వ భ — ఒక్కనమస్కారము లంచముఁ గొట్టులోనికిఁ బోనిచ్చినాఁడు.

2 వ భ — అయిన నీవుగూడ సిద్ధమేయన్నమాట

1 వ భ — ఆ!

2 వ భ — మఱిపదపద

(నిష్క్రమింతురు)

## 1 వ రంగము.

ప్రదేశము-రణభూమి  ప్రవేశము- ధర్మజ భీములు

భీముఁడు- మహాత్మా!

శా॥ అన్నా మీరిటు దుఃఖమొందఁదగునా ♦ యావంతయున్ జెప్పకే
యెన్నండైనభవద్వచోనియతికిం ♦ దేఁదప్పి నేనుంటి నే
మన్నింపన్ దయఁజూచినాఁడవుటినిన్ బ్ర ♦ హ్మాండమాకార్యమై
నన్నిందారుముదంబుతోఁ దెలుపుఁడా ♦ నంతంబుతోఁజేసెదన్॥

ధర్మ— (కన్నీటితో) అనుజా భీమసేనా!

మ॥ మునుముందొక్కట పాంచజన్య నినదం ♦ బున్ వింటి నేకాని పా
ర్థునిశంకధ్వనిరాక సాత్యకిని నెం ♦ తో తొట్రుపాటొందిపం
పినవాఁడున్ దరుఁజేరనట్లగపడెన్ ♦ భీమంపుసంగ్రామమం
దున నెట్లుండెను యర్జునుండకట!

(అనిపైఁజెప్పలేక భీముఁ గౌగలించుకొనియేడ్చును)

భీము— ... ... గం ♦ దుఃఖఁబొంద నేలన్నయా!॥ 2

(అని గూర్చుండఁబెట్టును)

అగ్రజా! శాంతింపుము

ఉ॥ శోకము బొందనేలమదిఁ ♦ జూచిన నాతని కేమి లోపమా
హా! కమలావిభుండరద ♦ మాలములోఁ నొగలెక్కి తోలఁగా
నాకపిశేఖరధ్వజము ♦ నల్లలనాడనభంగవాజుఁడై
నాకవిభూద్భవుండు కద ♦ నంబున గాండివ మెక్కు వెట్టనే
లోకమునంగలండతని ♦ రోమకపాయితదీప్తిఁజూడఁగా॥ 3

కావున నావంతయు వెఱవఁ బనిలేదు యథేచ్ఛలైతమఱిచ్చుటఁ బొరిపొచ్చెములేక యుద్ధముజేయవచ్చు.

ధర్మ— తమ్ముఁడా!

గీ॥ ఎన్ని చెప్పిన నామన ♦ పేవెఱకాని
నెమ్మదించ కభయముతో ♦ నిండియుండెఁ
గాన నెట్లైన నీవిప్డు ♦ వానిఁజేరి
విజయవార్తలఁద్వరలోన ♦ విశదపఱచు॥ 4

భీము— గీ॥ ఏనెయిటనుండిపోయిన ♦ న్గురుండు
తనప్రతిజ్ఞల నెరపనే ♦ మనఁగలాను

ధర్మ— నెరపుబెట్టులవానిన ♦ మరమునందు
జంపఁబుట్టుధృష్టద్యుమ్నుఁ ♦ డింపుఁజెలఁగ॥ 5

తమ్ముఁడానీవెన్నిజెప్పినను నామనసున్న కెక్కుటలేదు నాకై చింతింప వలదు. నీవేగకతప్పదు.

భీము— అట్లైన నోయగ్రజా! నీయిష్టము వచ్చినట్లేయొనర్చెదను శాంతులరగుఁడు
(తెరవంక దిరిగి) బావా! బావా! (అనిపిలుచును)

ధృష్టద్యుమ్నుఁడు—(ప్రవేశించి) బావా! నమస్కారము (ధర్మజునకు నమస్కరించి)
వృకోదరా! ఏమిరావించినది?

భీము— ఏమియులేదు

గీ॥ పూజ్యుఁడగు ధర్మజునిపట్ల ♦ పూన్కితోడ
జాగరూకుఁడవైయుండ ♦ సమయమయ్యె

నేనిదే యర్జునునిజాడ • నేగుమంచు
నాజ్ఞ జేసిన వల్లెయం • చరుగుచుంటి॥ 6

దృష్ట— బావ!

చ॥ కరువలిచూలి! యేటుకిట్టు • గట్టిగనన్యునకున్ వలెఁ బంపఁ
పరణములో గురుండుదర • పాలునిఁ గన్నులవెత్తి చూడఁగాఁ
దరమఁటే నాదు ప్రాణమున • దాలను వందుమొలంగుచుండఁగా
సరగునబోయి ధర్మజుని • శంకలదీర్పు బకాసురాంతకా॥ 7

భీమ— అట్లయిన నేనిదేపోయెద! మహాత్మా! సెలవా(ధర్మజునమస్కరించి)

ధర్మ— (సంతోషముతో) పోయి వేగ మేవానిఁ జూచినట్లే సింహనాదమొనర్పుము.

భీము— చిత్తము (నిష్క్రమించును)

ధర్మ— ద్రుపదాత్మజా! కనుంగొనుమప్పుడె ద్రోణుని మనభీముఁడు సమీపించి నాఁడు ఆహా!

దృష్ట— బావా! చూడుమా ధనురాచార్యుఁడా శుగశతంబులఁబుంఖానుపుంఖంబుగా నపారపారావారమగునట్లు కృపారసంబు చిఱునగవు నెపంబున బైటకు వెలువడుచుండ మన వృకోదరు దాకినాఁడు అయ్యో చూడనేలేదు మన గాలిచూలిచేఁ జాలసైన్యము గూలినదిసుఁడీ

ధర్మ— వినుమా మహానుభావుఁడగు కుంభసంభవుఁడేదిరో మందహాసముతోఁగూడిన ముఖారవిందమందమొంద వాత్రుచ్చుమన్నాఁడు

(తెరలో)

క॥ చలమున ననునీవిటన్
బలమొప్పఁగ గెలిచికాక • వశమే మొనకున్
గలయక సారఁగా నీశ
మ్మఁడనుమతుండిఁయియెకాదె • మొనసారఁగలిగెః॥ 8

దృష్ట— (సంతోషముతో) బావా! ధర్మరాజా కాంచుము కాంచుము.

గీ॥ తమ్ముని విషయమనినవా • క్యమ్ములకును
కోపరసముబ్బ వెబ్బులి • కూకలట్టు

భోబ్బరించుచు మొగమెరు • పుగదురంగ
భీకరంబుగఁ బల్కెడి • భీముఁడిదిగో॥ 9

(తెరలో)

క॥ ఏమీ మానవుఁడొక్కట
సామాన్యపురథికునడిగి • సైన్యముజోరు నే
భీమపుసురబలమైనన్
దామసమునఁ బఱుపుఁ గాక • ధనురాచార్యా॥ 10

ధర్మ— అయ్యో! ఇంక నేఁటియో యనుచున్నాఁడు ఏనితో నెప్పుడును సామములేక పోయెఁగదా

(తెరలో)

చ॥ మొనఁజొరగాఢయంబున న • మోనమయంచు ప్రియంబునల్క న
ర్జునుఁడను గానుసుమ్ము పటు • రోషకషాయితదీప్తి తేక్షణ
ప్రిణమదరాతిజాలుఁడఁగ • రాళగదాలలితుండ ఖండనం
బున గురువంచునిన్ వదలఁ • బోలునె శత్రుఁడనై మెలంగఁగా॥

[తరువాతఁ బెద్దకలకలము]

ధర్మ— [ఆతురముతో] ఇఁక నేమున్నదిఁక నేమున్నది! కట్టా! ద్రుపదాత్మజా!

మ॥ గదసారించిమహోగ్రకోపము కెలం • గన్ ద్రోణుపై నేయున
య్యది పృథ్వీతలమెల్ల బెల్లదరఁగా • నాశ్చర్యమైపోయి వే
చదిపెన్ సారథిరథ్యముల్ రథముతో • జచ్చెన్ గురుండక్కటా
కదనంబిట్టుగు రూత్తముల్ చనుటకే • కాబోలుఁ గావించుటల్॥ 12

ధృష్ట— మహాత్మా! విచారించెదరేల!

గీ॥ గురుఁడితరులచేఁగూలుటల్ • జరగునటవె?
వానిమృత్యువు నేనై • పరఁగుచుండఁ
గాంచుమామూలమెలమెల • గదలుచుండెఁ
బృథివికిని దాఁటిదెబ్బద • ప్పికొనఁబోలు॥ 13

భయములేదు వగవకుఁడు.

[అంతఁ దెరలోఁ బెద్దకలకలము]

ధర్మ— అదేమికలకలము?

దృష్ట— మఱేమియు లేదు. ద్రోణుని పరాభవము గన్నులారఁ జూచిన మనవారి భేరీనాదములు నుద్దండభుజాదండుఁడైన భీమసేనున కద్దురాలేక పాఱిపోవు కౌరవులయార్పులును జయోత్సాహుఁడై మన గాలిచూలి చేయు సింహనాదము నొకపెట్టనంత కలకలమైనది

ధర్మ— కనుగొనుమల్లదె మఱలనొక తేరుగూర్చుకొని వడముడికడ్డుపడి బెడిదములగు నంపజొంపములు గుప్పించుచున్న యాద్రోణుని

దృష్ట— [పరికించి] అదేమి భీముఁడు తేరుడిగ్గ నుఱికినాఁడు

[మఱలపరికించి యానందముతో] హోయి! హోయి!

బావగారూ! పరికింపుఁడు మీతమ్ముని పరాక్రమము

గీ॥ బిట్టువానకుఁ దలయొగ్గు • వృషభమట్లు
దిట్టరియయిపోయి గురుని • తేరుచేత
బట్టివిసరివిసరిపాఱ • వైచెనహహ!
యిట్టిధీరుని నేనెందు • నెఱుఁగ నెఱుఁగ ॥ 14

(తెరలోఁ బెద్దకలకలము)

ధర్మ— (సంతోషముతో) ద్రోణుఁడల్లదిగో మెలమెల్లగఁ దెల్లమొగముతో మొనకు బాఱివచ్చుచున్నాఁడు.

కృష్ణ— బావా! బావా! పరికించుమదే దూరముగా నాబకాసురాద్యనేకరాక్షసాంతకుఁడైన భీమున కెట్లు కురుసైన్యము వెన్నిచ్చిపరువం జొచ్చినదో!

ధర్మ— దూరముగా నుండుటచే నంతగాఁ గనంబడలేదు.

దృష్ట— ఔను.

(తెరలో సింహనాదముతోఁ బాంచజన్య దేవదత్త ధ్వనులు వినంబడును)

ధర్మ— (ఆనందముతో దృష్టద్యుమ్నుఁ గౌఁగిలించుకొని) ద్రుపదాత్మజా! నాకు కర్ణరసాయనమగు సింహనాదము దానికిఁదోడుఁ బాంచజన్య దేవదత్తంబులు వినంబడియె నాశంకలన్నియుఁ దీరె. రమ్ము పోయి యామొనఁజూచికొందము.

దృష్ట— చిత్తము.

(నిష్క్రమింతురు)

## 2వ రంగము.

ప్రదేశము రణభూమి— ప్రవేశము పూర్వోక్తభటులిద్దరు

1వ భ— బావా! నీకుమగ లెందఱు ?

2వ భ— నాకు నీకుఁగలిపి ముందొక్కఁడేమగఁడు.

1వ భ— తరువాత ?

2వ భ— ఇప్పుడంతా వెరసి ముగ్గురు.

1వ భ— క్రొత్తమగని ప్రచారమెట్లున్నది ?

2వ భ— క్రొత్తమగనివలెనే యున్నది.

1వ భ— అనఁగ ?

2వ భ— అనఁగ నేమిటి ? యిద్దరుమగల ద్రోసిరాజుజేసివచ్చిన మగని శత్రులకు గ్రిక్కుఱు మనుటకును వీలుండదుకదా! అందుననితఁడు కొంచెము సురేకారమెక్కిన పటువట్లు చర్చర్రనేవాఁడు. పైఁబడఁగఁ గొట్టుటకు సిద్ధముగా నున్నాఁడు (పరికించి) కాంచుమిదివఱకే కర్ణుని ముమ్మూరు నఖక్షతములకు బదులు బాణక్షతములఁ జేయనోర్వలేక పాఱిపచ్చియు మఱలఁజచ్చినట్లుపోయి కలియుచున్నాఁడు.

2వ భ— ఔనౌను అది నేకాంచనేలేదు (పరికించి) కనుంగొనుమా మూఢ దుర్యోధనునిదన స్నేహితుని పాట్లఁజూడలేక తమ్ములకుఁ జేయిచ్చి యేమియో వకాణించుచున్నాఁడు.

గీ॥ ఓరి! శత్రుంజయాసుదే • హాండవోరి
నాదుతమ్ములార! యినజు • మీఁదననిల
జుండటూల ఘోరశరముల • జాండమునర
నేయుచుండఁ జూచెదనేల • యేగుఁడిపుడ ॥ 15

2వ భ— బావా! చూచితివా యన్నచెప్పిన చొప్పునఁ బోయిరమన శత్రుంజయాదికురుకుమారులు పొల్లుసప్తవిశిఖహతిచే నారికేళలు క్రిందవ్రాల్లుచున్నవి.

1వ భ— అయ్యయ్యో భీముని రథ్యములు నేలఁగూలినవి ఇఁక నేమున్నది

2వ భ— చూడమేమో భీముఁడుగ్రుఁడై వ్యాఘ్రముఁబోలి వాక్రమ్మచున్నాఁడు.

(తెరలో)

ఓరోరి దుష్టాత్మా

గీ॥ కాంచుమిప్పుడె లేఖలో ♦ కంటఁగందు
ఖోరివాక్యూర ! కర్ణని ♦ వారువెపర

(మరియొకగొంతులో) ఓరోరి తిండిపోతా !

వెదరుటకు నేనుగానలోఁ ♦ బారుగలేదు
ఆకులలములుదినుచు నే ♦ నడలలేదు ॥ 16

2వ భ.— ఆహా ! భీమసేనుఁడుగ్రుఁడై సమగ్రముగా నారిలాగి తనభుజశక్తి దెలియునట్టి లోకఘనశక్తి కర్ణునిపై వైచెను.

1వ భ— భయములేదులే ! కర్ణుఁడద్దానిమధ్యనే నఱికినాఁడు. అయ్యయ్యో మనమనుకొనునంతలో వృకోదరుఁడడరి యజ్జుఁడైన సూతజుపైనురుకుటయు నాతఁడు భీరుడై కేతనపుబల్లక్రింద నొరగుటయు భీముఁడద్దాని నెఱుంగక క్రిందకురుకుటయుఁ గర్ణుఁడుఁదోడనే బాణములేయ మొదలిడుటయు నయ్యో ! జూడుము.

1వ భ— బావా ! చూడుము పాపము.

సీ॥ తన్నుఁగాపాడుకొనుటకై ♦ తగినయాయు
ధంబులేక యర్జునుచేత ♦ దళితమాగ
జములఁజేఁబట్టిశరములఁ ♦ జదుపుచుండె
మోసములుజేయు సూతాధ ♦ ముండుపెలఁగ ॥ 17

2వ భ— నారాయణ ! నారాయణ ! చుట్టుపట్టులనున్నపీనుంగుతిట్టలపై మూఁకుమైన బాణజాల నోర్వలేక మఱుఁగు వెదకుచున్న యావృకోదరుఁజూచి ననబ్బబ్బ నాకడుపు చెఱువగుచున్నది.

1వ భ— బావా ! బావా ! అయ్యయ్యో ! ఏమిచెప్పుదును.

గీ॥ చేయునదిలేకఖిన్నుఁడై ♦ సిగ్గువొడమి
మఱుఁగుజేరినభీముని ♦ మొఱకుఁడగుచు
వింటికోలనుబొట్టను ♦ నంటఁబొడిచి
పలుకుచున్నాఁడు కర్ణుఁడు ♦ కుల్కియదిగో ! ॥

(తెరలో)

భీమా ! తిండిపోతా !

ఆ॥ వె॥ ఓరి ! తిండిపోత • పోరేలరాసీవు
యిల్లుఁజేరియుండుము • మెంతయైన
కన్నుఁగానకీవు • కదనంబులోమము
బోటివారిఁజేరు • టేటిబుద్ధి ? ॥ 19

మఱియు

ఉ॥ వనములయందు నాకులును • బండ్లనుదించు మెలంగలేకయీ
రణమహికేలవచ్చితిరి • రాఁదగునేయిటు సిగ్గులేక ; వీ
వనితపరాభవింపఁబడి • బాగుగనున్నదె ? ధర్మజుండుయీ
గనియమముల్ చెలంగిసుఖి • గా ? నరుఁడున్ బురుషత్వమందెనే? ॥ 20

1వ భ— ఛీ ఛీ వీనిబ్రతుకుగాల సిగ్గులేని యూరకుక్కవలెతోఁకముడిచి మువ్వు రుఁ బోవుటయెకాక ముసలిముండయైనఁ జేయనేరని పనిజేసి మోసపుచ్చి తుచ్ఛపువిజయ మొందితినిగదాయని విఱ్ఱవీగుచునెట్లు మాట్లాడినాఁడో దుర్మార్గుఁడు. వీనికర్ణునిచే నింతికింతయున్నది. చూడుము (పరికించి) హాయి హాయి నేనని నష్టమైనది ! చూచితివా !

గీ॥ దూరమునసుండికర్ణుఁడు • త్రుళ్లుఁజూచి
ఘెళ్ళుమని బాణమొక్కటి • వింటఁదొడిఁగి
గొల్లటంచునురారాజు • గోలపెట్ట
జోల్లనేసెను గర్ణునా • గొల్లుఁడలర ॥ 12

2వ భ— మనభీముడేడి పాపము.

1వ భ— తనసారధి విశోకుఁడు తెచ్చిన తేరెక్కి మఱలఁ గర్ణునిపై ఐడబ్బాపబని తక్షోపానలము జల్లారువట్లు బెట్టిదములగు ప్రదరములఁ బుంఖానుపుంఖము గాఁబఱపుచున్నాడు.

2వ భ— శారమ్మ మనపాలటికొక్క బాణము చాలును.

1వ భ— సరేపద . పద .

నిష్క్రమణము.

(తోడనే కృష్ణార్జునులు రథారూఢులై ప్రవేశింతురు.)

అర్జు— (సందేహ సూచకముగా) బావా సాత్యకి పరాభవంబున నాకు గడుంగడు జింతదొంతరెక్కుచున్నది. నేఁజేసిన యీ యధర్మముగూడ నాకేదియో సంశయము గలుగఁ జేయుచున్నది.

కృష్ణు— నీ చేసిన యధర్మమేమిటి ?

అర్జు— పరుఁడగు సాత్యకితోఁ బోరుచున్న భూరిశ్రవుని భుజాదండ మూరకనే నఱకుటయే యధర్మముకాదా ?

కృష్ణు— బాగు బాగు యీలాగు నుండవలె ధర్మము.

ఆ॥ వె॥ నీదు స్నేహితుండు • నిర్మలశిష్యుండు ।
సాత్యకిని నతండు • చంపనుండ
వానిభుజము నఱక • దానిన ధర్మమ
టంచుఁ బల్కుచుంటి • వహహ నీవు ॥ 22.

చ॥ పలువురు జుట్టుముట్టి పసి • వానిరథంబుఁ బడంగఁజేసి తు
ల్వలు వెనుకేగి విల్లునిమి • ప్రాణముఁ దీసిన ధర్మమేకదా ?
పలువురతో రణంబొసలి పక్వశ్రమము నొందఁ దుదన్ బరాభవం
బులు బడునట్టి స్నేహితునిఁ • బ్రోవనధర్మమె ? ధర్మవేత్తవో॥ 23.

ఈధర్మ సూక్ష్మమింటి పెద్ద సావకాశులమై యోచించుకొనవచ్చును. గాని ముందు జరుగఁబోవు కార్యమాలోచింపుము. యేలయనిన

ఉ॥ రవియును జాలగ్రాలఁ జొచ్చెనిటసం • గ్రామంబునన్ ఘోరము
య్యొవిరోధుల్ చలమొప్పనిల్చిరయయో • యెట్లింక నామున్ సైం
ధవునిన్ గూల్తువో ?

అర్జు— కంటికిన్ గనంగనై • నన్ జంపుదున్ గానిచో
బవరంబందునఁజంపుటెట్లికనుసం • ప్రాప్తించునో చెప్పుమా ॥ 24.

కృష్ణు— [చిఱునగవుతో] కానిమ్ము నాచాకచక్యము గొంచెము జూతువుగాక

[అంత నాకాశంబంతయుఁ జీకటులగును]

అర్జు— మహాత్మా యదేమి యిట్లంథకారమైనది.

కృష్ణు— [చిఱునవ్వుతో] మఱేమిలేదు

గీ॥ నాదుచాకచక్యంబునఁగ • నంగరాజేయ
మాయపాలాఁడనుగానని • మాయపన్ని
తపనుగప్పితినందుచేఁ • దమము పెఱిగె
సంధ్యవేళనితోఁచఁగ • సైంధవునకు ॥ 25

కావుననిఁకఁద్వరలో వానితలనఱుక ప్రియత్నింపుము.

(తెరలో)

గీ॥ సూర్యుఁడల్లదెయస్తాద్రిఁ • జారఁగఁబోయె
సైంధవుని ప్రాణములఁబ్రోవ • సమయమిదియె
యొక్కత్రుటిలోన నర్జునుం • డుచ్చరించు
ప్రతిజ్ఞలెల్లను వ్యర్థమౌఁ • బదిలపడుఁడు ॥ 26

కృష్ణ— (ఆతురముతో) అర్జునా ! యర్జునా !

గీ॥ తపనుఁడిప్పుడు వేగమ • స్తమయమగునౌ
నంచువేడ్కతోఁబడమర • నరయుచున్న
సైంధవుఁడదేకనంబడు • శంకలేల ?
శిరసునఱుకఁగాఁదగుగురు • శరమువిడుము ॥ 27

అర్జు— మహానుభావా ! కానవచ్చుచున్నాఁడు. (బాణము సంధించిభక్తితో)

మ॥ వరబాణంబ ! త్వరన్ రిపున్ రణములోఁ బల్వుర్ కనన్ మెచ్చగా
సరిగాఁద్రెళ్ళఁగఁ జేసినన్ముఁటకు నీ • శక్తిఁ విడంబించుచున్

[అనిబాణమేయగానె]

కృష్ణ— [ఆత్యాతురముతో]

ధరపైనాతనిమస్తకంబుపడఁగాఁ • దప్పానునీవయ్యదం
బరమందాడఁగ జేయుమిప్పడుభవ • ద్బాణప్రయోగంబునన్ ॥ 28

అర్జు— మహానుభావా ! దమయాజ్ఞ శిరసావహించుచున్నాను.

(అనిబాణమేయ శిరసుదివికేగి యక్కడనతని బాణకలన నాడుచుండును)

అర్జు— కృష్ణాఏటికీవింత

కృష్ణ— మరేమియులేదు. యీతనితండ్రి యీతని మస్తకమునేల బడవైచినవాని
మూర్ధము వేయువ్రక్కలగునట్లు శపించెను. కావున నిద్దానిఁబాఱపత

ముచే వానిచేతిలోననే పడునట్లు చేయుము. వానిపటము వానినెత్తిని గొట్టినట్లగును.

అర్జు— (అబ్బురముతో) ఆతఁడిప్పు డెక్కడనున్నాఁడు ?

కృష్ణు— కురుక్షేత్రంబున సంజవార్చుచున్నాఁడు.

అర్జు— అట్లైనసరే ! [అనిపాశుపతము సంధించి]

గీ॥ శంకరునిచేత మెలఁగున • స్త్రింబఁనీవు
నాపయినిదయఁగల్గి క్ష• ణంబులోన
నీశిరమ్మును వానిపి • తృకరమందు
పడఁగనైచుముఁజేయుదు • వందనములు ॥ 29

[అనిబాణమేయ శరమెగిరిపోవును]

[అంతఁదెరలో]

క॥ ఎక్కడనుండియొ యీశిర
మక్కజముగ వృద్ధతపసి • హస్తమునఁబడెన్
వెక్కసమైయిలఁద్రోచిన
వ్రక్కలయెన్ వానిశిరము • రారండయ్యో ॥ 30

కృష్ణు— [అమితానందముతో నర్జునుఁ గౌఁగలించుకొని]

చ॥ గెలిచితిమింక నందరును • ఖింపనిలింపులకింపునింపునీ
బలతుదిగంతదంతురిత • పాండురకీర్తి విరాజితంబయెన్
బలరిపుసూన ! సత్యపరి • పాలన భీకరశత్రుశోషణా
యిలఁగలరే ! భవద్విశిఖ • బృందమునన్ బడకుండువారహో ! ॥ 31

అర్జు— [చిఱునవ్వుతో] బావా ! ఆత్మస్తుతిఁజేసుకొనెదవేల ?

కృష్ణు— ఆత్మస్తుతి యెక్కడదిక్కడ ?

అర్జు— ఆత్మస్తుతికాదా ? చుక్కానిఁద్రిప్పువాఁడేపడవ బాగుగ నడచిన దన నెట్లుండునో యట్లుకాదా ? పోనియిదియే నాప్రజ్ఞయనిన నీకునాకుభేదము లేనప్పుడది యాత్మస్తుతికాదా ?

కృష్ణు— ఇదియా నీయాత్మస్తుతి ? నాసంతోషముపట్టఁజాలక యట్లంటిని. నీవలిన ట్లోడకుండ వలసినవిన్నియు లేకపోయినఁజుక్కాని యేమిచేయఁగలదు-

అర్జునా! ఇప్పటికి మనమనుకొన్నవన్నియు సిద్ధించినవి. ఇఁకమనకేమైన కోరుకలున్నవా?

అర్జు— మహానుభావా! కోర్కెలేటికి? అయినను గోరుమని సాక్షాద్భగవంతుఁడె యడుగనూరకుండ రాదుకావున.

మంగళమహాశ్రీవృత్తము.

ోగ్రహము జూచినమ ♦ హీస్థలిని సంపదల ♦ శాంతయువిశాజిలుచునుండఁగా
త్యాగమును భోగమును ♦ ధర్మము దమంతనెస ♦ దావసుధవర్తిలుచురాఁగవ్
ోగరహితుండయిన ♦ రుండుసతతముక్ దనని ♦ రూపితములైనపనులక్ స
త్యాగమహితుండయిమె ♦ లంగఁగవిరాజులుతి ♦ రంబురహితోఁజెలఁగుగాతక్ ॥ 32

కృష్ణ— తథాస్తు. తథాస్తు.

(నిష్క్రమణము)

గద్య.

శ్రీమద్గాడేపల్లికుల సల్లలిత పల్లవిత మల్లికా వల్లరీఫుల్ల కుసుమానుపమాన పవిత్ర భారద్వాజస గోత్రా సమానానుభవైక బ్రహ్మవిద్యాధురంధర వెంకట శాస్త్రిపుత్ర మిత్రానందదాయను జనవిధేయసూర్య నారాయణాభిధేయ విరచిత సైంధవార్జున నామ నాటకము పంచమాంకము.





# కీర్తనలు.

---

## (1) 5-14 నకులుడు—కరహరిప్రియరాగం—రూపకతాళం

పట్టిగుణముల పెట్టిబలమున • జెట్టియభిమన్యుండిలన్
గట్టిగను యీపద్మవ్యూహము • గుట్టెరింగిన వాడగున్ ॥ ప ॥
గట్టులుకయీ వీరులురువడి • ముట్టడింగొనదావడిన్
గుట్టుచెడి బడబాణతతులను । గొట్టకనుమానండొగిన్ ॥ ప ॥
యిట్టిదిట్టరి యీజగంబున । బుట్టడని సేనెరుగుడున్
బట్టియని సందియము నొందక । బంపుధర్మజవానికిన్ ॥ వ ॥
యిపుడు వీనినిబంపకుండిన । నీల్గుమనమోహారమొగిన్
రిపులతో ద్రోణుండు నేడీకృపుడు । వడిదురపిల్లగాన్ ॥

## (2) 7-28 అభిమన్యుడు—బలహంసరాగం—ఆదితాళం

సెలవునిమ్ము రిపులబట్టిచెండివేసెదన్ ।నిలువనీక కౌరవులను నలమివంచెదన్ ॥ సె
తులువలైన వీరవరుల నిలనుగలిపెదన్ । బలురధికులు నడల బాహుబలముజూ
పెదన్ ॥ సె
బలుసేనల బాణవహ్ని బాలుచేసెదన్ । దిటవునెరపి కీర్తి నిలను దేజరిల్లెదన్ ॥ సె

## (3) 16-5 దుర్యోధనుడు—మలయమారుతం—ఏకతాళం

రక్షింపు రక్షింపుమా । గురుదేవ । ర ॥ యీబాలుని బారినిజేరి సైపలేము ॥ ర ॥
చండమార్తాండుడవన్ । నిండువేడీ మీతోనింకెవెలింగెడి ॥ ర ॥
మాక్షికములగ్గిని । వీక్షించి మర్గ్గీన విధమాయెమంమింక ॥ ర ॥

## (4) 24-6 భీముడు—యమునారాగం—ఆదితాళం

బాలకనిన్ను బాశి । బతుకంగజాలానాదు।బ్రారబ్ధమిటులాయెగా।అహ నాయన్నా ॥ బా
మించినాపూర్వసంచితామెల్లానిన్నె । దృంచిదాపురామాయెగా । అహ ॥ దృ ॥

కరులున్న నేలా ఈశిరులున్న నేలానిన్ కరముగూడాకయున్నను॥ అహా ॥ క ॥
బిరుదెందరున్న నేమి ఫలమునీవు లేకున్న పాపచిత్తుడనైతిగా॥ అహా॥ పా॥

## (5) 28-5 అర్జునుడు—అసావేరి—అటతాళం

యేమనిసైతు నావిధి ॥యే॥ ప్రేమనునిను బెంచి పెద్దవగుదువని పెండ్లిజేసి నేనుంటిగా
అహా నాయన్నా॥ యేమి ॥
బలువురముమేముండి పాపమనాకానిన్నా । పాపులపాలద్రోసితి॥ అహా । యే॥
బారుడేటికిపద్మవ్యూహంబు మొహరించే । పరగ నేనులేకుండగా ॥ ఆ ॥
బలువురనొకాటిగాఁ బాలునిబట్టిజంపా । బాపమనగా తగదె॥ ఆ ॥ యే॥

## (6) 29-24 అర్జునుడు—అమీరుకళ్యాణి—అటతాళం

పాపియగు సైంధవునిరేపే । బట్టిస్రుంచెదజూడుడీ పాపమనకయ పాపిశంకరు
ప్రాపుజేరిన వీడికన్ ॥ పా ॥
ఘనుడు హస్తాచలమునందున నింపుమీరుచునుండగన్ । దాపునను కర్ణాదియోధులు
ధైర్యమునగాపాడగన్ ॥ పా॥
దుష్టులగుదుర్యోధనాదుల । దులుపదనములు బలువడిన్ బరువుపడయర్జునుడువీడన
బట్టి జంపిన దుష్టునిన్ ॥ సా ॥

## (7) 38-9 సుభద్ర—శ్యామరాగం—ఆదితాళం

కన్నకూన నిన్నుబాశి కనలుదానరా । నావిన్నపంబు నీదుచెవుల । వినవదేమిరా ॥క॥
అవ్వయవ్వయనుచువెంట। నాడనెవరురా। దవ్వుసేయనిముసమైన దాళలేనురా ॥ క ॥
కండ్రిముద్దుదీరదివిరి। దయనుబలుకరా । కన్నదాన నెటులకతిన। ఖర్మమోద్దురా ॥క॥
ఆవులేని సంపదలిల నిలువనేలరా। బాలుమాలిధాతగతిని। బాదుచేసెరా ॥ క ॥

## (8) 37-29 చారుడు—బలహంసరాగం—ఆదితాళం

పారిపోవగాసాగె। ఆమందుడు డెందము గందగుందుచును ॥ పా ॥

భీంసన్నా హైదలకంచి | సన్నసంన్నా నేనురుపడి ॥ బా ॥
కర్ణ దావిగానగగా | గురుకృపాశల్యులెంన్నో గతులాగోణుగా |
బన్నగామేర బాణము న్నా జాలునచు ॥ బా ॥
రారాజు హైబట్టుక | నిలువరియొకి తులువాయనుచు దిట్టగా |
బలుకాక నీవన్న బలుకులకేవాడు ॥ బా ॥

## (9) 71-12 కృష్ణుడు—జంజూటిరాగం—ఆదితాళం

దునుమసమయామిదె | ఆ | పాకియా సైంధావు బట్టిదిట్టియాత్రై ॥ దు ॥
యినుమగ్రంకేవానుచు నాదగుమాయ యనిగానకను బొంగుచూ |
యరికోనసిలచి యానన మెత్తుచుంన్నాడు ॥ దు ॥
వంతలుదీరగను | యాశత్రుడు | నంతాముసోంపగను | నెంత్రా వేగరమున |
ద్రుంతువోగాంతును ॥ దు ॥ ౨ ॥
కురురాజు జింతిల్లగా యాకర్ణాదులు | వడిగంపింపగా |
బరువడియారాజు | దలనీడబడకుండ ॥ దు ॥ 3 ॥

## (10) అందరు—మంగళకాశిక రాగం—రూపకం

మంగళమిదె మంగళాంగునకు | శమా | యంగానాపతికినీ లాంగునకు శుభ ॥ మం ॥
కృష్ణునకును | జిష్ణునకు | వక్షిష్ణునకును యాదివిష్ణునకు శుభ ॥ మం ॥ మం ॥
సైంధవాజ్ఞాన నాట్యసాక్షునకు | సాధుపక్షరక్షణ విచక్షునకు శుభ ॥ మం ॥



| | | |
|---|---|---|
| **నవలలు** | | |
| సౌందర్యతిలక-రెండుభాగములు | 1 | 0 |
| హేమలత | 0 | 8 |
| అహల్యాబాయి | 0 | 8 |
| మహాపురుషుల జీవితములు-మొదటిభాగం | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| రాజస్థానకథావళి | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| వినోదములు మొదటిభాగం | 0 | 4 |
| డిటో రెండవభాగము | 0 | 4 |
| ~~వీరబలవినోదములు~~ | 0 | 6 |
| అబలాసచ్చరిత్రరత్నమాల | 1 | 0 |
| కృష్ణదేవరాయచరిత్ర | 1 | 4 |
| గృహకల్లోలనివారణి | 0 | 8 |
| **పద్యకావ్యములు.** | | |
| వరాహపురాణము | 1 | 0 |
| మార్కండేయపురాణము | 1 | 4 |
| పద్మపురాణము ఉత్తరఖండం | 1 | 4 |
| భోజరాజీయము | 1 | 0 |
| ఉత్తరహరివంశము | 1 | 4 |
| మొల్లరామాయణం | 0 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నం | 0 | 8 |
| రాజశేఖరచరిత | 0 | 8 |
| అసీదం సూరకవిగ్రంథములు | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము (శతకంక:) | 0 | 8 |
| కవిరాజమనోరంజనం | 0 | 8 |
| జైమినీభారతము | 0 | 10 |
| సుదక్షిణాపరిణయం | 0 | 10 |
| చమత్కారమంజరి | 0 | 4 |
| ప్రబోధచంద్రోదయం | | 6½ |
| వైజయంతీవిలాసము | 0 | 6 |
| దశావతారచరిత్ర | 1 | 0 |
| విజయవిలాసము | 0 | 6 |
| రసికజనమనోరంజనం | 0 | 6 |
| కవిజనచకోరచంద్రోదయం | 0 | 6 |
| ఆముక్తమాల్యద సటీక | 2 | 8 |
| శృంగారనైషధం | 0 | 6 |
| కళాపూర్ణోదయం | 1 | 8 |
| సరసభూపాలీయం | 0 | 8 |
| ఆంధ్రభాషాభూషణం | 0 | 2 |
| అప్పకవీయం | 0 | 12 |
| సులక్షణసారం | 0 | 8 |
| నీలాసుందరీపరిణయం | 0 | 4 |
| సుబ్రహ్మణ్యచరిత్ర | 0 | 10 |
| శశిరేఖాపరిణయం | 0 | 4 |
| శ్రీనాథునివీథినాటకం | 0 | 1 |
| చిత్రరాఘవము | 1 | 0 |

డ్రామాలు.

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | 8 |
| ప్రసన్నయాదవము | 0 | 8 |
| పారిజాతాపహరణం | 0 | 8 |
| సుగుణమణి | 0 | 8 |
| చంద్రకాంత | 0 | 8 |
| సంగీతశశిరేఖ | 0 | 8 |
| అభినవరాఘవము | 0 | 8 |
| హస్తినాపురం | 0 | 8 |
| ఉషాపరిణయం | 0 | 8 |
| సుశీల | 0 | 8 |
| పీష్వానారాయణరావువధ | 0 | 8 |
| జయంతజయపాల | 0 | 6 |
| అభిజ్ఞాన శాకుంతలము | 1 | 0 |
| వేణీసంహారం | 0 | 14½ |
| మల్లికామారుతం | 0 | 14 |
| ప్రబోధచంద్రోదయం | 0 | 10 |
| ద్రౌపదీస్వయంవరం | 0 | 8 |
| సంగీతపాశుపతార్జునం | 0 | 8 |
| సంగీతసైంధవార్జునం | 0 | 8 |
| హరిశ్చంద్ర | 0 | 8 |
| కలభాషిణి | 0 | 12 |
| బొబ్బిలియుద్ధం | 0 | 12 |
| గులేబకావళి | 0 | 13 |
| విజయచంద్రచంద్రరేఖావిజయం | 0 | 12 |
| చంద్రగుప్త | 0 | 12 |
| విచిత్రబిల్హణీయం | 0 | 8 |
| పాండవజననము | 0 | 9 |
| పాండవప్రవాసం | 0 | 12 |
| పాండవవిజయం | 0 | 12 |
| పాండవఅశ్వమేధం | 0 | 12 |
| పాండవఉద్యోగం | 0 | 12 |
| పాండవఅజ్ఞాతవాసం | 0 | 6 |
| నర్మదాపురుకుత్సీయం | 0 | 12 |
| సారంగధర | 0 | 8 |
| ప్రచండచాణక్యం | 0 | 12 |
| విప్రనారాయణచరిత్ర | 0 | 12 |
| విజయరాఘవము | 1 | 0 |
| వనవాసరాఘవము | 0 | 12 |
| కుశలవనాటకము | 0 | 12 |
| సంగీత సత్యహరిశ్చంద్ర | 0 | 12 |
| వరూధినీవిలాసము | 0 | 10 |
| చిత్రనళీయం | 1 | 4 |
| విషాదసారంగధర | 1 | 2 |
| చంద్రమతీపరిణయం | 0 | 8 |
| సంగీతసావిత్రి | 0 | 4 |
| దక్షిణాగోగ్రహణం | 0 | 4 |
| రత్నావళి | 0 | 6 |
| ప్రహ్లాద | 0 | 4 |

వలయువారీ క్రింది యడ్రస్సునకు దరఖాస్తులు పంపవలెను.

కర్రా అచ్చయ్య బుక్కుసెల్లరు,
రాజమండ్రి.